**వట్టివేరు తడికలు**

ఈ సైజులుగలవి వెంటనే సప్లయిచేయబడును. 7' × 4', 6' × 4', 6' × 3', 4' × 3', 3' × 3' చదరపు x 1కి రు1/8-
ప్రతిపట్టణములోను మా సరుకు స్టాకుచేసి అమ్ముటకు ఏజంట్లు కావలెను.

**కస్‌కస్ ప్రాడక్ట్సు కంపెనీ**
సామర్లకోట, M.S.M.


# ఆంధ్రపత్రిక


**ప్రశస్తమైన ఆయుర్వేదౌషధములు**

శాస్త్రీయమైన 200 రకముల ఆయుర్వేదౌషధములు, పేటెంటు మందులు ఎల్లప్పుడు మా వద్దను, మా ఏజంట్లు అందరివద్దను సిద్ధముగ నుండును.
కేటలాగు, సలహా-చికిత్స. ఏజంట్లు కావలెను.
వాఙ్మ లక్ష్మీవరుల సుబ్రహ్మణ్యశాస్త్రి, A.V.A.C
రామకృష్ణా ఆయుర్వేద ఫార్మసీ,
గాంధీనగరం బెజవాడ.



**The Andhra Patrika, Madras,** } Regd. No. M. 1118 Vol. 34 No. 337 WEDNESDAY 31st MARCH 1948 వెల ఒక అణా { **Founder: K. Nageswara Rao**


## తమ ఏజెంటు జనరల్ ద్వారా నిజాం ప్రభుత్వానికి అధినివేశ ప్రభుత్వ శ్రీముఖం

### మున్షీగారితో లాయక్ ఆలీ, సర్ మాంక్టన్ దీర్ఘసంభాషణలు

హైదరాబాద్, మార్చి 29: హైదరాబాద్‌లో భారత ప్రతినిధి మున్షీగారు ఢిల్లీనుండి హైదరాబాద్‌కు వచ్చినవెంటనే, భారతప్రభుత్వపు కడపటి సందేశాన్ని నిజాంప్రభుత్వానికి అందచేశాడని తెలుస్తున్నది. ఈ సందేశం విషయమై ఆయన నిజాంప్రధాని లాయక్ ఆలీతో మూడుగంటలు రహస్యంగా చర్చజరిపాడు. అనంతరం నిజాంకు రాజ్యాంగ సలహాదారు సర్ వాల్టర్ మాంక్టన్‌కూడా మున్షీగారిని కలుసుకుని చాలాసేపు చర్చించాడు.

ఈసందేశంలో ఏమున్నదీ బయట పెట్టడానికి ఉభయపక్షాలూ నిరాకరించారు కాని, యథాతథపు ఒడంబడికను నిజాం ప్రభుత్వం ఉల్లంఘించిన సంఘటనలన్నిటినీ ఇండియా ప్రభుత్వం ఆ సందేశంలో ఉదహరించి, వెంటనే ఆ తప్పులను సరి దిద్దుకొనవలసినదని కోరినట్లు, తెలుస్తున్నది. రజాకార్ దళాలను తక్షణమే రద్దు చేయవలెననికూడా ఇండియా ప్రభుత్వం కోరినట్లు తెలుస్తున్నది.

జవాబు ఇవ్వటానికి ఇండియా ప్రభుత్వం ఒక కాలపరిమితిని నిర్ణయించకపోయినప్పటికీ, జవాబు చాల త్వరలో రావాలని వారు సూచించారు. మూడు, నాలుగు వారాల్లో నిజాంప్రభుత్వం జవాబును పంపుతుందని తెలుస్తున్నది.

ఇండియా సందేశం ఆంతర్యసందేశపు ధోరణిలో లేకపోయినప్పటికీ, ఇండియా, నిజాంల భవిష్యత్సంబంధాలు నిజాం జవాబుపై పూర్తిగా ఆధారపడి వుంటవని ఇక్కడ విశ్వసిస్తున్నారు. ఇండియా హైదరాబాద్‌ల అభిప్రాయభేదాలు పరిష్కార సాధ్యంకావని ఇక్కడ సర్వత్రా ఒక అభిప్రాయం వ్యాపించివున్నప్పటికీ, నిజాంప్రభుత్వం మాత్రం, తమ వైఖరిని ఇంకా దిశదీకరించి, ఇండియా వారిని మరింత సావధానంగా పరిశీలిస్తే, ప్రతిష్టంభన ఏర్పడకుండా నివారించవచ్చునని అభిప్రాయపడుతున్నది. ప్రతిష్టంభన ఏర్పడ్డట్లయితే, సంస్థానంలోనూ, బయటా, ఎటో విపరీత ఘటనలను నివారించాలంటే, అట్లాటి ప్రతిష్టంభన రాకుండా సర్వశక్తులా ప్రయత్నించాలని ఇక్కడ భావిస్తున్నారు.

ఇండియా, హైదరాబాదుల సఖ్యంగా

(5-వ పేజీ చూడుడు)

### జపానునుండి లక్ష మరకదుళ్లు

భారత, జపాను ప్రభుత్వాల ఒడంబడిక

న్యూఢిల్లీ, మార్చి 29: లక్ష మరకదుళ్లను జపాను ఇండియాకు సరఫరా చేసేటట్లు ఇండియా 80,000 టన్నుల బొగ్గను జపానుకు పంపించేటట్లు, జపాను, భారత ప్రభుత్వాలు ఒడంబడిక కుదుర్చుకొన్నట్లు తెలుస్తోంది.

క్రొత్త మిల్లులు నిర్మించటానికి తగినన్ని పుచ్చుకొన్న పారిశ్రామికులకు, మరకదుళ్లు సప్లయి చేస్తామనీ, దరఖాస్తులు ముందుగానే పెట్టుకోవలసిందనీ భారత ప్రభుత్వం వారికి తెలియజేసింది.

### అధినివేశ ప్రభుత్వ బడ్జెట్‌లో రు 213 లక్షల లోటు

ఆర్థికబిల్లుకు సెలక్టుకమిటీ సూచించిన సవరణల ఫలితం

కాఫీ, టీ, దుంపనెయ్య సుంకములరేటు తగ్గింపు

న్యూఢిల్లీ, మార్చి 30: సెలెక్టు కమిటీచే సంస్కరింపబడిన బడ్జెటును సభ్యులు యోచించవలసిందిగా భారతప్రభుత్వ ఆర్థికశాఖా మంత్రి శ్రీ షణ్ముఖం చెట్టి నేడు అధినివేశ శాసనసభలో సభ్యులను కోరారు. సెలెక్టుకమిటీ ఆర్థికబిల్లులో చేసిన మార్పుల ఫలితంగా బడ్జెట్‌లో అదనంగా 104 లక్షల రూపాయలు లోటువచ్చునని, మొదట బడ్జెట్లో అంచనా వేయబడిన లోటు 109 లక్షలు, యీ 104 లక్షలు కలిసి మొత్తం లోటు 213 లక్షలవునని, సెలక్టు కమిటీ సవరణల ఫలితంగా కాఫీ, టీలపై విధించబడిన పన్ను పౌ 1 కి 2 అణాలనుంచి 1 అణాకు, దుంపనెయ్యిపై పన్ను 0-8-0 రెండు అణాలకు తగ్గునని వెల్లడింపబడినది. (ఈ విషయము సంగ్రహముగా నిన్న పత్రికలో ప్రచురిమైనది.)

దుంప నూనెల ఎగుమతిపై విధింపబడిన పన్నును టన్ను 1 కి రూ 200/- ల నుంచి రూ 160/- లకు తగ్గించవలెనని దిగా సెలెక్టు కమిటీ సూచించింది. నూనె గింజల ఎగుమతి వ్యాపారంకన్నా నూనెల ఎగుమతి వ్యాపారానికి తగిన ప్రోత్సాహం లభించగలదనే ఉద్దేశ్యంతోనే యీ సవ

(5-వ పేజీ చూడుడు)


ప్రకటన

ఈ తేదీనుండి దిగువవిలాసమునందు మేము పనిచేయుచుందుమని తెలుపసంతసించుచున్నాము.

మదరాసు - మౌంట్ రోడ్

**పురుషోత్తం బిల్డింగ్సు**

సందలి క్రింది అంతస్తు

మా సిటీ బుకింగు ఆఫీసు ఇచటనేయుండును. మా క్రొత్త టెలిఫోన్ నెంబరు

**84490**

STAR LINE — INDIAN OVERSEAS AIRLINES

ఇండియన్ ఓవర్‌సీస్ ఎయిర్ లైన్సు లిమిటెడ్,
మదరాసు.

29-3-48



## ఇత్తడి, రాగిరేకులు,

స్ట్రయిపులు, సర్కిల్సు, వైరులు, అన్ని గేజీలలోను, సైజులలోను దొరకును.

ఇత్తడి టిఫిన్ క్యారియర్లు, స్టెయిన్‌లెస్ ఉక్కుపాత్రలు, ఇతర పాత్రలు, ఇంకను యితర నాన్‌ఫెరస్ సామానులు.

మీకు ఇంకొకచోట కావలసియుండు దయచేసి మాతో సంప్రదించండి.

**పి. ఎస్. ఎన్. ఎస్. అంబలవాన చెట్టియార్ & కంపెనీ లి॥**
310/311 లింగిచెట్టి వీధి, మద్రాసు
ఇంకను
**పి. ఎస్. ఎన్. ఎస్. అంబలవాన చెట్టియార్,**
మట్టంచేరి పోస్టు, కొచ్చిన్.

నోటు: దయచేసి మీ అడ్రసును మా వద్ద నమోదుచేయించండి. అందువల్ల మీకు ఉచితముగా అప్పుడప్పుడు కొటేషనులు పంపగలుగుదుము.


## విధులు లేకుండ హక్కులుమాత్రం ఉండవు

### కలకత్తాలోని కేంద్రప్రభుత్వ ఉద్యోగులసమ్మెపై నెహ్రూ ఖండన

### "రాజకీయ ప్రయోజనముల సాధించుటకు ఒక అల్పసంఖ్యాకవర్గం దౌర్జన్యచర్యల జరుపుతున్నది"

న్యూఢిల్లీ, మార్చి 30: కలకత్తాలోని కేంద్రప్రభుత్వ ఉద్యోగుల సమ్మె, ప్రాయోపవేశ నిర్ణయమును తీవ్రముగ ఖండించుచు నేడధినివేశ శాసనసభలో ప్రధానామాత్యుడు పండిట్ నెహ్రూ ఒక దీర్ఘ ప్రకటన చేశారు.

ఇందులో ఆర్థిక విషయాలేమీ లేవని, కేవలం ఒక అల్పసంఖ్యాకవర్గం రాజకీయ ప్రయోజనముల సాధించుటకు వేసిన ఎత్తుగడ ఇది అనీ, భారత ప్రభుత్వం ఇలాంటి దుశ్చర్యలను సహించలేదనీ హెచ్చరించారు. నిర్వహించవలసిన విధులు అనేవి లేకుండా, అనుభవింప తగ్గ హక్కులంటూ ఉండవని నెహ్రూ ఉద్ఘాటించారు.

పండిత జవహర్‌లాల్ నెహ్రూగారు నేటి ఉదయం డొమినియన్ పార్లమెంటులో ఈ ప్రకటన చేసిరి:— కలకత్తాలోని కేంద్రప్రభుత్వ కార్యాలయములందు ఉన్న ఉద్యోగులు సమ్మెచేయ సన్నాహరని తెలుసుకొనుటకు విచారించుచున్నాను. అధిమామూలుకదలిన సమ్మెగాదనియు అసాధారణమైనదనియు కార్యాలయములలో కూర్చొని సమ్మెచేయ సన్నాహరనియు, నిరశనవ్రతము చేయసన్నాహరనియు తెలియుచున్నది. పైగా వారిని దౌర్జన్యమును పురికొల్పి దౌర్జన్యపద్ధతులు అవలంబించవలెనని దుర్బోధకూడా జరిగినది. సమ్మెను లేవదీయువారు పూర్తిగా ఆర్థిక కారణములను పురస్కరించుకొనియే చేయుచున్నారనుట సరిగాదు. దీనివెనక రాజకీయ ఉద్దేశ్యము ఉన్నది. కాని ఆర్థికకారణమని సమ్మె పురికొల్పువారు చెప్పినను రాజకీయ రంగమున ప్రభుత్వమున కిదియొక సవాలు. ఇందువల్ల అతిముఖ్యమైన అనేక విషయములు ఉత్పన్నమైనవి.

భారతదేశములో వివిధప్రాంతములలో ఒక పద్ధతిప్రకారము రాజకీయముగా నడుపబడుచున్న దౌర్జన్య చర్యలలో అంతర్భాగమే ఇక్కడ కలకత్తాలో నిర్వహింపబడనున్న సమ్మె అంతర్భాగము. అల్పసంఖ్యాకులు అధికసంఖ్యాకులపై తమ యిష్టమును బలవంతముగా రద్దుటకు యత్నించినచో ఏ ప్రభుత్వముగాని, ప్రజాహిత జీవనముగానినడువదు.

తమ ఉద్యోగులకు సహాయ పడుటకు ప్రభుత్వమువారు శ్రద్ధచూపుచున్నారు, వారికి ప్రజలయెడగూడా విధిబాధ్యతఉన్నది దేశములో ప్రతిస్త్రీకి, పురుషునికి కావలసిన పదార్థములు ఉత్పత్తిచేయించవలసి ఉన్నది. అయితే అందరిని పరిరక్షించవలెననుట కష్టము. భారత జాతీజీవనము పునర్నిర్మాణము చేయుటకు, సాధ్యమైనంతవరకు పరికల్పించుటకు బ్రహ్మాండమైన ప్రణాళికల అమలుచేయవలసి ఉన్నది. ఇప్పుడు నెందరలేదీన చేయసన్నారన్న సమ్మె మార్చి 17 న జరగటానికి ఉండెనుగాని ఎందువల్లనో వాయిదా వేయబడినది. కేంద్రప్రభుత్వ ఉద్యోగి ఫెడరేషనువారు సమ్మెఏర్పాటు చేయుచున్నారు. ఇది కలకత్తా సంస్థ. అధికార ఢిల్లీలో కొంతమేరకు మించు అడేపడ్డలిన మరొక సంస్థయున్నది. వారు ఢిల్లీలో సమావేశము జరిపిరి. దాని కార్యవర్గమువారు నన్ను చూచి కలకత్తా సంస్థతో సంబంధములేదని నాకు తెలిపిరి. (హర్షం). ఆర్థికమంత్రి వద్దకు కలకత్తా సంస్థవారు రాయబారము వెళ్లి జీతములు హెచ్చింపకోరిరి. జీతముల పరిస్థితిని సెంట్రల్ పే కమిషనువారు ఉద్యోగులనుండి సాక్ష్యములుతీసుకొని విచారణ చేసియుండిరి. అన్ని తరగతుల ఉద్యోగుల జీతములు హెచ్చించుచూ

(4-వ పేజీ చూడుడు)

### పాలస్తీనా విభజన

ఐక్యరాజ్య సభ పునరాలోచన

లండన్, మార్చి 30: పాలస్తీనాలో బ్రిటిష్‌వారి మాండేటరీ అధికారము మే నెల 15 తేదీతో అంత్యమగును. ఐక్యరాజ్య సమితి అధికారమునకిందకు వచ్చును. అందువల్ల ఐక్యరాజ్య సమితి ఒక కమిటీని పాలస్తీనాకు పంపెను. పాలస్తీనాను రెండు భాగములుగా చేసి కొంత యూదుల రాజ్యముగాను, మరికొంత అరబ్బుల రాజ్యముగాను విడదీయవలెనని ఇదివరలో ఐక్యరాజ్య సమితి నిర్ణయించెను. ఆ ప్రకారముగా విభజన చేయుటకు పాలస్తీనాకు చేరిన ఐక్యరాజ్య సమితియొక్క కమిటీ పని ప్రారంభించెను.

యూదుల భాగమున కొక ప్రత్యేక తాత్కాలిక ప్రభుత్వమును ఏర్పాటుచేయుటకు పాలస్తీనాలోని వివిధ రాజకీయ పక్షముల ప్రతినిధులను పిలిపించి గతరాత్రి సంప్రదించుట జరుపబడెను. తాత్కాలిక యూదీయ ప్రభుత్వ వర్గములో చేరు వారి పేర్లను యీ కమిటీ వెల్లడించునని వ్యవహారజ్ఞులు చెప్పుచున్నారు. అయితే యీ తాత్కాలిక ప్రభుత్వము ఐక్యరాజ్య సమితియొక్క ధర్మకర్తృత్వాధికారమును చలాయించజాలదు.

ఐక్యరాజ్య సమితి పునరాలోచన: అరబ్బులున్నూ, యూదులున్నూ తమ పోరాటమును, తగాదాలను విరమించి సఖ్యతగా ఉండవలెనని కోరుతూ, పాలస్తీనా సమస్యను పునరాలోచన చేయవలెనని కోరుచు ఐక్యరాజ్య సమితియొక్క భద్రతా మండలి రెండు తీర్మానములను అమెరికా సంయుక్త రాష్ట్రముల ప్రభుత్వము ప్రతిపాదింప దలచియున్నది.

ఐక్యరాజ్య సమితి పాలస్తీనాలో ధర్మకర్తృత్వాధికారమును వహించవలెనను విషయమునగూర్చి భద్రతామండలి సమావేశములో అమెరికా ప్రతినిధి సూచనగా ప్రస్తావించారు.

అరబ్బుల ప్రాంతంపై యూదుల బాంబు

అరబ్బుల రేవుపట్టణమైన జాఫామీద యూదులు బాంబులు వేసిరని పాలస్తీనా

(5-వ పేజీ చూడుడు)

### పరమాణుశక్తి కంట్రోలు

రష్యా సూచనకు మిత్రరాజ్యాల నిరాకరణ

లేక్‌సక్సెస్, మార్చి 29: "పరమాణుశక్తి కంట్రోలు విషయమై రష్యా చేసిన సూచనను బ్రిటన్, కెనడా, ఫ్రాన్సు, చైనాలు నిరాకరిస్తున్నవి. ఇంకొక రష్యన్ ప్రతిపాదనను ధ్వంసంచటం నిరుపయోగం. పరమాణుశక్తిని అంతర్జాతీయ కంట్రోలు కిందపెట్టే విషయంలో రష్యా చేసిన సూచన ఏమీ అంగీకారయోగ్యం గాలేదు. పరమాణుశక్తి ఉత్పత్తిలో ఉపయోగపడే పదార్థాలు అక్రమంగా వినియోగపడకుండానూ, నియమం ఎవరయినా ఉల్లంఘిస్తే కనిపెట్టడానికీ, ఉల్లంఘించినవారిమీద తగినచర్య తీసుకొనటానికీ, రష్యా సూచనలో వీలులేదు. అణుశక్తి ఆయుధాలను ఎవ్వరూ ఉత్పత్తిచేయటానికి వీలులేకుండా చేయవలెనన్న పేమీ వర్షాపరశా, ఆ ఆయుధాలు చేతిలోవున్న వారు వదులుకొంటారనుకోటం పొరపాటు.

(5-వ పేజీ చూడుడు)

### చైనా శాసనసభ్యులపై చాంగ్ ప్రభుత్వనిర్బంధం

నాన్‌కింగ్, మార్చి 29: మొట్టమొందటి సారిగా ఎన్నికలయిన చైనా జాతీయ శాసనసభలో అప్పుడే ముసలం పుట్టింది. "అల్పసంఖ్యాకుల పక్షాల"కు స్థానాలు ఇచ్చే నిమిత్తం 100 మంది కోమింటాంగ్ శాసనసభ్యులు తమ పదవులను వదులుకోవాలని ప్రభుత్వం ఆజ్ఞాపించింది. కాని తాము న్యాయసమ్మతంగా ఎన్నిక అయినాము కనక తమ స్థానాలను వదలమని వారు ఎదురుతిరిగి శాసనసభాభవనంలో నిరశనవ్రతానికి పూనుకోవటంవల్ల, ప్రభుత్వం వారిని బలవంతంగా వారి హోటళ్లకు తీస్కొని, అక్కడ నిర్బంధంలో వుంచింది. వీరికి సానుభూతిగా మరొక 100 మంది శాసనసభను బహిష్కరించటానికి నిశ్చయించారు.

నిన్న ప్రభుత్వపక్షం, యంగ్ చైనా, సోషల్ డెమోక్రాటిక్ పక్షాలతో చేసుకున్న ఒప్పందాన్నిబట్టి 'అల్పసంఖ్యాక పక్షాల'కు కోమింటాంగ్ 100 స్థానాలను, యంగ్ చైనా పార్టీ 60 స్థానాలనూ, సోషల్ డెమోక్రాట్లకు 60 స్థానాలనూ ఇవ్వటానికి, మంచూరియా లో 'స్వేచ్ఛ' తో ఎన్నికలు జరపటానికి అంగీకరించబడినది. కాని కోమింటాంగ్ సభ్యులు 169 మంది సమావేశమై ప్రజాభీష్టాన్ని రక్షిస్తామనీ, ప్రభుత్వానికి లొంగిపోయి తమ స్థానాలను వదులుకోమనీ ప్రతిజ్ఞ చేశారు. కోమింటాంగ్ సభ్యులు స్థానాలను వదులుకోనకపోతే తాము శాసనసభను బహిష్కరిస్తాము సోషల్ డెమొక్రాట్లు అన్నారు. అన్నిపక్షాలు తాత్కాలికంగా స్థానాల సమస్యను నిలిపినందువల్లనే శాసనసభ ప్రారంభ సమావేశమైనా జరిగింది. అందులో చాంగ్‌కైషేక్ కమ్యూనిస్టు ప్రమాదాన్నిగురించి మాట్లాడాడు. కాని సమావేశం సాగించటానికి 'కోరం' లేనందువల్ల రేపటికి వాయిదా పడ్డది.

### కైకలూరు కారాగారంనుండి కమ్యూనిస్టుల పరారీ సందర్భంలో జైల్ ఉద్యోగుల బర్తరఫ్

["ఆంధ్రపత్రిక" విలేఖరి]

విజయవాడ, మార్చి 29: మార్చి 11 వ తేదీ సాయంత్రం కైకలూరు సబ్ జైలునుంచి 6 గురు కమ్యూనిస్టులు పైపై దీపు తప్పించుకొని పోయిన సందర్భంలో జైలు సూపర్నెంటు పి. ఎ. మో. న్, పోలీసు సబిన్స్పెక్టరు రుద్రప్పగార్లను కృష్ణాజిల్లా అధికారులు బరతరఫ్ చేశారు. అప్పుడు జైలుకు కాపలా కాస్తున్న 6 గురు పోలీసుల మీదను, ఒక హెడ్ కానిస్టేబుల్ మీదా, కర్తవ్యాలయం అశ్రద్ధ చేశారని ప్రభుత్వం కేసు పెట్టబోతున్నది.

### మాల్టాదీవి అమెరికాకు దానం

లండన్, మార్చి 28: మాల్టాద్వీపంలో నావికా విమానస్థావరాలను స్థాపించుకోవలసిందిగా బ్రిటన్ అమెరికాను ప్రతిపాదించినదని న్యూయార్కు పత్రిక "న్యూయార్కు హెరాల్డ్ ట్రిబ్యూన్" వ్రాసినది.





**వ్యక్తిత్వము ఇంకను సర్వత్రా నమ్మకము**

మీరు ఒక గడియారమును యెన్నుకొనునప్పుడు వ్యక్తిత్వము మాత్రమే ప్రధానాంశముగా మీరు పెట్టుకొనగూడదు. దానికితోడు, అది నమ్మకంగా పనిచేసేటట్లయితే, పైకు చూపించుటలోను, అందమైనవస్తువ ధరించుటలోను మీరు తృప్తినిచ్చేగడియారమును పొందినవారగుదురు. ప్రతి "వెస్టెండు" మాడలు ఈ రెండులక్షణములు కలిగియున్నది. అది ప్రత్యేకవ్యక్తిత్వము కలిగియుండుటేకాక, దృఢముగానుండి నమ్మకముగా పనిచేయును. గడియారముమీద వున్న మా పేరు యీ రెండు లక్షణములకు హామీయిచ్చును.

ప్రస్తుత పరిస్థితులవల్ల, ప్రకటించిన ప్రతిగడియారం సప్లయి చేయలేక పోవచ్చును. స్టాకులు వున్నంతవరకు మీ ఆర్డర్లు నిర్వహింపబడును.

వెస్టెండ్ వాచ్ కంపెనీ,
బొంబాయి & కలకత్తా.

**WEST END WATCH Co.**
BOMBAY CALCUTTA

**CAUSTIC SODA**
**కాస్టిక్ సోడా**
(Solid or Flakes)
మద్రాసు, గిడ్డంగివద్ద Cwt. 1-కి ఖరీదు రు 56/- లు. మార్చి, ఏప్రిల్ షిప్ మెంట్లునుండి సప్లయి చేయబడును. భారీ మొత్తములకు ప్రత్యేక ధరలు.
**హెచ్. చందన్‌మల్ & కో.,**
కెమికల్ డీలర్సు, మద్రాసు. 3.



**విప్పు పెట్టెలు**
మంచికమీషనులో "స్టాండర్డు" మరియు "కాళ" బ్రాండు నిప్పుపెట్టెలు హోల్ సేల్‌లో దొరకును. కొలది ఏజెన్సీలు మాత్రమే ఖాళీగా వున్నవి. వివరములకు
**SOUTHERN INDIA MATCHES MFG. CO.,**
**(Regd.) CHOSEPET.**



50 కాపి ప్యాకెట్లు ఒ. 1 గ్రోసు రు. 7½
నెలకు రు 60/- మంచి రు 100/-ల వరకు జీతం మీద ఏజెంట్లు కావలెను.



**బహిష్టు** ఏ కారణంవల్ల 4, 5 నెలలనుండి గూడ ఆగిపోయినప్పటికీ, "రాజప్రవర్తక" మందువాడితే, వెంటనే సులభంగా ప్రారంభమౌతుంది. నిరపాయమైనది. ఖరీదు రు. 2-8-0 పోస్టేజి అ. 12 లు.
Calcutta Ayurved Pharmacy, (A)
163-1, Cornwallis St., CALCUTTA-6.



**కుష్ఠు ★ బొల్లి**
క్యాటలాగు ఉచితము.
**రెడ్డి & కో.,** (రిజిష్టర్డు)
గోపాలపురం.
(వయా) తణుకు, తూ॥ గోదావరి.


# అఖిల నిజాం ప్రభుత్వ శ్రీముఖం

(1-వ పేజీ తరువాయి)

వుండటం చాల అవసరమని నిజాం ప్రధాని నిన్న ఒక బహిరంగసభలో చేసిన ఉపన్యాసన ఒక్కటే ఈ పరిస్థితుల్లో కొంచం ఆశను కలిగిస్తున్నది. సంస్థానంలోని అందరు తీవ్రవాదులు ఇటువంటి సద్భావాన్నే ప్రకటిస్తే, చాలా బాగుంటుందని ఒక అనధికార ప్రముఖుడన్నాడు. మొత్తానికి రాబోయే కొద్ది వారాల్లో హైదరాబాద్ చరిత్రలో చాల క్లిష్టమైన ఘట్టమేరాబోతున్నది. ప్రస్తుతం నిజాంలో భారత సైన్యాలేవీ లేవని చెప్పవచ్చును. ఆలారంలోవున్న కొద్దిసైన్యాలు త్వరలోనే వెళ్లిపోతున్నవి.

**ఇండియాపై ఆరోపణ**

"గుల్బర్గాజిల్లా కోల్‌గ్రహాగ్రామం నివాసులు ఇండియన్ యూనియన్ ప్రాంతంనుంచి కొందరు సాయుధ గూండాలు వచ్చి, కోతలు అవుతున్న పంటలను దోచుకుందామని ప్రయత్నించారు. కాని ఇంతలో ఒక నిజాం మిలిటరీదళం అక్కడకు రాగా, ఉభయపక్షాలూ కాల్పులు జరుపుకున్నాయి. అందులో ఇద్దరు గూండాలు మరణించి, కొందరు గాయపడినందున, వారు పడిపోయినవారిని మోసుకొని, యూనియన్ ప్రాంతంలోకి పారిపోయినారు." అని నిజాం ప్రభుత్వ ప్రకటన ఒకటి తెలియచేస్తున్నది.

**విద్యార్థులపై హింసాకాండ**

నిన్న సాయంత్రం హైదరాబాద్‌లో సత్యాగ్రహం చేసిన విద్యార్థులలో 48 రిని పోలీసులు అరెస్టుచేసి ... దారుణంగా హింసించారు. ఆ విద్యార్థుల ప్రతినిధులు ఆవేళ భారతప్రభుత్వ ప్రతినిధి మున్షీ గారి వద్దకు వెళ్ళనున్నారు. ప్రతినిధుల్లో ఒకరికి తీవ్రంగా గాయతగిలిన్నాయి. ఒకరికి నడుము విరిగిపోయింది. మున్షీ గారు జవాబిస్తూ, ఆ విషయంలో తాను నిన్న పోయుండెననీ, నిజాం ప్రభుత్వం మాత్రమే పోలీసు అత్యాచారాలను వారించాలనీ అన్నాడు (స్వ. వి.)

# ఆర్థిక బిల్లు సవరణ

(1వ పేజీ తరువాయి)

రణ సూచించబడింది. ఇందుమూలంగా ప్రభుత్వ ఆదాయానికి 33 లక్షల రూపాయలు నష్టంవచ్చునని అంచనా వేయబడింది.

మాంగనీస్ ఎగుమతి విషయంలో కస్టమ్సు రేటులో నాల్గోవంతు పన్నుగా విధించాలని కమిటీ అభిప్రాయపడింది. అయినా నాణ్యపు రకానికి చెందిన మాంగనీసు ఎగుమతి అంతగా ప్రోత్సహించడం మంచిదిగాదని, తక్కువ తరగతి మాంగనీస్ ఎగుమతి అయ్యేటందుకుగాను, పన్ను యీవిధంగా ఉండాలని కమిటీ అభిప్రాయపడింది.

అయినా పరిస్థితి యింకా సందిగ్ధంగానే ఉన్నా, కస్టమ్సు రేటులో నాల్గోవంతు ఎగుమతి పన్నుగా విధించాలన్న కమిటీ సూచనను శాసన ప్రస్తుతానికి స్వీకరిస్తున్నారు. శేషానికిది ప్రయోజనకారిగా చేసేట్లు కన్పించేయెడల తరువాత తగ్గిస్తారు. దీనిమీద ఆదాయంలో వచ్చే నష్టం 8 లక్షల రూపాయలు.

రాబడిపన్ను కనిష్ఠ పరిమితి రు 2500/-ల నుండి రు 3000/- లకు పెంచబడింది. ఇందువల్ల 50 లక్షల రూపాయల ఆదాయం తగ్గిపోతుంది. మ్యునిసిపాలిటీ ఆస్తి, ఆదాయాలపైన పన్ను రేటును తగ్గించి కొంతవదుపాయం కల్పించాలని మొదటి బడ్జెట్‌లో సూచింపబడింది. ఈ సదుపాయాన్ని కల్పించేవిషయం, రాబడి పన్ను చట్టాన్ని సవరించే సందర్భంలో ఆలోచించవలసిన విషయంగాని, ప్రభుత్వ బడ్జెట్‌లో ప్రతిపాదనచేయ తగ్గ విషయంగాదని సెలెక్టు కమిటీ అభిప్రాయపడ్డది. ఈ సదుపాయాన్ని కల్పించకుండా ఉండడం మూలంగా బడ్జెట్ తొలి అంచనాకన్న యిప్పుడు 75 లక్షల రూపాయలు ప్రభుత్వ రాబడి పెరుగుతుంది.

ధర్మకార్యాలకై యివ్వబడిన విరాళాలపైన, విద్యాదానధర్మాలపైన, పన్ను తొలగించాలని, మొదటిబడ్జెట్‌లో సూచించబడింది. కాని ఈ సూచన 48 ఏప్రెలు 1 వ తేదీ అనంతరం యివ్వబడిన విరాళాలకు, దానధర్మాలకు వర్తించాలని, అంతకుపూర్వం వాటిపై పన్ను విధించాలని సెలెక్టుకమిటీ సిఫార్సుచేసింది. ఈ సిఫార్సు ఫలితంగా ప్రభుత్వానికి 75 లక్షల రూపాయలు అదనంగా రాబడివస్తుంది.

మొత్తం బడ్జెట్‌లో 204 లక్షల రూపాయలు, సెలెక్టుకమిటీ సవరణఫలితంగా 150 లక్షల రూపాయలు ఆదాయంలో పెంపువచ్చింది. పోతేనికరం బడ్జెట్ నష్టం 54 లక్షల రూపాయలు. దీనికి రాబడిపన్నులో రాష్ట్రాలకు చెల్లించవలసిన మొత్తం (సుమారు 50 లక్షలు) కలపాలి. "అంటే మొత్తం నికరనష్టం 104 లక్షలు" అని షణ్ముఖంశెట్టి శెలవిచ్చాడు.

**శివరావ్ విమర్శ**

సెలెక్టుకమిటీ సవరణలు దీనివారికి యే మాత్రమూ మేలుకలిగించేవిగా లేకపోవడం తనకు చాలా ఆశ్చర్యంగా ఉన్నదని బి. శివరావ్ విమర్శించారు. వ్యాపారలాభాల పన్ను మూలంగా వచ్చే ఆదాయంలో కొంతభాగాన్ని తిరిగి పరిశ్రమల కివ్వడంలో అర్థమేమిటో తెలియదని జ్ఞానికాలు అభిప్రాయపడుతున్నట్లు, దీనికి కార్మికులకు పెట్టుబడిదారులకు బోనస్ రూపేణ ... ఉత్పత్తి అధికంగా కాగలదని తాను అభిప్రాయపడుతున్నట్లు శివరావ్ శెలవిచ్చాడు. భారత ప్రభుత్వ తరపున విదేశాలకు వెళ్లిన రాయబారవర్గ సభ్యులు విపరీతంగా డబ్బును ఖర్చుచేస్తున్నారని, ఈ ఖర్చును తగ్గించడానికి ఆర్థికమంత్రి ప్రయత్నించాలని శివరావ్ అన్నాడు.

రాష్ట్రీయ ఆర్థికమంత్రులతో సంప్రదించి, "అమ్మకపు పన్ను" విధింపు అధికారాన్ని అందుమూలంగా వచ్చే ఆదాయాన్ని కేంద్రప్రభుత్వం తీసుకోవాలని ఆర్థికమంత్రికి శివరావ్ సలహాయిచ్చాడు.

కేంద్ర ప్రభుత్వంయిచ్చే ఆర్థిక మొత్తాను రాష్ట్రప్రభుత్వాలు సద్వినియోగం చేస్తున్నాయో లేదో, తెలుసుకొనేందుకు రాష్ట్రప్రభుత్వాల బడ్జెట్‌లను పరిశీలించే ఆర్థికసంఘాన్ని నియోగించవలసిన విషయాన్ని ఆర్థికమంత్రి ఆలోచించాలని శివరావ్ సూచించాడు.

**కె. టి. షా**

పూర్వపాలకుల పృచ్ఛకానికి స్వస్తిచెప్పి, ఒక నూతన దృక్పథాన్ని అలవర్చుకొని, భారతదేశంలో పన్నువిధింపు పద్ధతిని ప్రభుత్వం పూర్తిగా సంస్కరించడం యెంతైనా అవసరం. ప్రపంచంలో ఉన్న తారతమ్యాలను పోగొట్టడానికేగాక దేశ సంపదను పెంపొందించడానికి గూడా పన్నువిధింపు సమర్థమైన సాధన. కాని, ఆర్థికమంత్రి బడ్జెట్, ఉండవలసినంత సత్తావున్నదిగా లేకపోవడంవల్ల నాకు నచ్చలేదు. ఒక వ్యక్తి తనకూ, తన కుటుంబానికి, 50 వేలు, 60 వేలు లేదా లక్ష రూపాయలు యెందుకు ఖర్చుపెట్టగలగాలి. ప్రతివ్యక్తి ఆదాయానికి ఒక పరిమితి ఏర్పరచి అది పోగా మిగతా ఆదాయాన్ని ప్రభుత్వం యెందుకు స్వాధీనపరచుకో గూడదు.

సామాజిక సేవను, కార్యకర్తల సమీకరణ జరగాలంటూ యిటీవల పండిట్ నెహ్రూ అన్నారు. దేశ సంపద విషయములోగూడా ఇలాంటి సమీకరణ ఇంకా కొంత తీవ్రంగానైనా సరే ఎందుకు ఉండగూడదు? ప్రస్తుతం ధనికులైన వ్యక్తులు తమ ద్రవ్యాన్ని, తమ యిష్టము వచ్చినరీతిని, యిష్టము వచ్చినచోట, దేశప్రయోజనాన్ని లక్ష్యం చేయకుండానే వ్యయపరుస్తున్నారు. ఈ దుర్వ్యయాన్ని ప్రభుత్వం యెందుకు అరికట్టగూడదు. పెట్టుబడిదారులు ఎంత యెక్కువగా దేశాభిమానాన్ని ప్రకటిస్తే, అంత యెక్కువగా స్వార్థలాభాన్ని స్వసంఘాభివృద్ధిని కాంక్షిస్తున్నారన్నమాట."

రిజర్వుబ్యాంకును జాతీయం చేయాలనే ప్రభుత్వ సంకల్పాన్ని విమర్శించినవారు పోస్టాఫీసులను, రైల్వేలనుగూడా ప్రైవేటు వాణిజ్యసంస్థలపరం చేయాలని యెందుకు అనగలేదో? వీటిని నిర్వహించడం ఈ ప్రభుత్వానికన్నా ఎక్కువ సామర్థ్యం, పొదుపరితనం బహుశః ఎక్కువ లాభాలు గడించేరకంగూడా ప్రైవేటు సంస్థలకున్నదని వారివాదన. సైన్యాన్ని, నావికా వైమానిక బలాలను తమపరం చేయించేయాలని ప్రైవేటు సంస్థలవారు కోరరు. ఇందుకు కారణం అవి లాభదాయకం కాకపోవడమే. ఒక్కముక్కలో చెప్పాలంటే తక్కువ కృషితో ఎక్కువ లాభాలు వచ్చేపన్నీ ప్రైవేటుసంస్థల అధీనం కావాలని వీరు కోరుతున్నమాట. ఇక ఉత్పత్తి పడిపోవున్నదని, ఇందుకు కారణం ప్రభుత్వ పన్నుల విధానమేనని గోల బయలుదేరింది. అయితే మనదేశం కన్నా ఎక్కువగా పన్నులు విధింపబడే అమెరికా బ్రిటన్‌లలో యేమైనా ఉత్పత్తి పడిపోయిందా. ఉత్పత్తి పడిపోతున్నదంటే, ప్రభుత్వపన్నులు గాదు, ఇతరకారణాలున్నాయి" అని కె. టి. షా అన్నాడు.

ప్రజాసామాన్య జీవనప్రమాణాభివృద్ధికి యీ బడ్జెట్ యేమాత్రం తోడని పంటి సాధుశాస్త్రి అన్నాడు.

**ఆచార్య రంగా సూచనలు**

వ్యవసాయాన్ని, కుటీర పరిశ్రమలను అభివృద్ధి చేయడానికి, పరిశ్రమల నిర్వాహణకు ఒక సివిల్ సర్వీసును సృష్టించేందుకు ప్రభుత్వం శ్రద్ధవహించాలని ఆచార్య రంగా సూచించాడు:

"ఆర్థిక మంత్రి పెట్టుబడిదారి పక్షాన నిలబడడం చాలా శోచనీయం. ఈ వైఖరికి సామ్యవాదమని పేరుపెట్టి, తన అజ్ఞానాన్ని తాను తెలుసుకోకుండా దీనిని యింకొకలనెత్తిపై రుద్దాలని చూచాడు. సామ్యవాదంలో భిన్న తరగతులున్నాయి. గాంధీజీ రెండు సంవత్సరాలుగా నిర్వచించిన సామ్యవాదం, వ్యక్తిస్వాతంత్ర్యానికి పెద్దపీట. దేశ ఆర్థిక వ్యవస్థను, అధికారాన్ని కేంద్రీకరణ చేయడమే, గాంధీజీ సామ్యవాదలక్ష్యం. బడ్జెట్ ప్రతిపాదనలపై ఆర్థిక మంత్రి యింతవరకూ యిచ్చిన రెండు మూడు ఉపన్యాసాలను యెంత తరచి చూచినా గాంధీజీ సామ్యవాద సిద్ధాంతాన్ని ఆయన అంగీకరించినట్లు కన్పించదు. రాజకీయరంగంలో స్వపరిపాలన వున్నట్లే ఆర్థికరంగంలో గూడా స్వపాలన ఉండాలని మహాత్ముని ఆశయం. చిన్న పరిశ్రమలు, కార్మికులను, చాల ముఖ్యంగా గుర్తించాలి. అప్పుడే ఉత్పత్తి అధికం కాగలదు.

బడ్జెట్‌ను తయారుచేసే ముందుగా, కనీసం ఒక ఐదు సంవత్సరాల కాలపరిమితిగా తన దృష్టియందుంచుకోవలసింది.

ఋణాల విషయంలో ప్రభుత్వం చాలా పటుత్వమైన విధానంతో ముందుకురావాలి. దేశంలో కావలసినంత డబ్బు ఉన్నది. ఈ డబ్బునంతా వసూలుచేసి, ప్రభుత్వం తన పథకాలకు అనువుగా ఉపయోగించుకోవాలి. పన్నుల విధానాన్ని ఋణ విధానాన్ని పూర్తిగా పునఃపరిశీలన చేయాలి. పెట్టుబడి ద్రవ్యాన్ని, బలవంతంగానైనా సరే సేకరించే విషయాన్ని ప్రభుత్వం ఆలోచించాలి. అంతేగాని డబ్బుకోసం కేవలం షేర్ మార్కెట్టుపైనే ఆధారపడి ఉండడం సముచితంగాదు.

సామ్యవాదమైన సహకార సంఘాభివృద్ధి ఉద్యమానికి ప్రభుత్వం చేయూత నివ్వాలి అని ఆచార్య రంగా, ప్రభుత్వ బడ్జెట్‌ను విమర్శిస్తూ యీ సూచనలను చేశాడు. పండిట్ నెహ్రూ లక్షించిన విధానానికి షణ్ముఖంశెట్టి అనుసరించిన విధానానికి పొంతన యేదీ లేకుండా ఉన్నదని కరీముద్దీన్, దేశంలో హరిజనోద్ధరణకు కృషి జరగుట లేదని ఒకరాష్ట్ర ప్రభుత్వం హరిజనోద్ధరణకు బడ్జెట్‌లో 1 కోటి రూ ప్రత్యేకించినా, పని యేమి జరగలేదని శ్రీమతి దాక్షాయణి వేలాయుధన్‌గారలు విమర్శించారు.

కృష్ణచంద్రశర్మ, షిబ్బన్‌లాల్ సాక్సేనా బ్రజేశ్వర్ ప్రసాద్ కృష్ణమూర్తి ప్రభృతులు చర్చలో పాల్గొన్నారు. చర్చకు ఆర్థికమంత్రి సమాధానమిచ్చిన పిమ్మట సభ రేపటికి వాయిదాపడింది.

# ఫ్రెంచి ఇండియా భవిష్యత్తు

**ఫ్రెంచి ప్రభుత్వపు సంసిద్ధత**

కరైకాల్, మార్చి 28: ఫ్రెంచి ఇండియా ప్రతినిధులకు అధికారం అప్పగించటానికి ఫ్రెంచి ప్రభుత్వం సిద్ధంగా వున్నదనీ, భారత యూనియన్‌లో చేరటమా లేదా అనే ప్రశ్న జనవాక్య నిర్ధారణవలన గాని ప్రతినిధి సభవలనగాని నిర్ణయించబడుతుందనీ, ఫ్రెంచి ఇండియా మంత్రి డా॥ ఆండ్రి నేడు చెప్పాడు. పాండిచేరిలో స్థావరం ఏర్పరచుకోవటానికి ఫ్రెంచి ప్రభుత్వం అమెరికాకు అనుమతి ఇచ్చిందని బయలుదేరిన వదంతి నిరాధారమనీ, ఒకవేళ నిజమైనా ఫ్రెంచి ఇండియాలోని సోషలిస్టుపార్టీ దాన్ని ప్రతిఘటిస్తుందనీ ఆయనన్నాడు.

చంద్రనగరం ఇండియాలో చేరటం విషయమై మాట్లాడుతూ, ఫ్రెంచి ఇండియా ప్రభుత్వ్యక్తులన్ని కమ్యూనిస్టులను 3 రోజులు బంధించి బలవంతంగా సంతకం పెట్టించినందువల్ల వీ ఈ సమస్య బయలుదేరిందనీ, రాజకీయ సమర్థనలు ఏమీ జరుగకుండా ఆవిధంగా చేరటానికి పశ్చిమబెంగాల్ ప్రభుత్వం ఒప్పుకోలేదనీ డా॥ ఆండ్రి అన్నాడు.

# పాలస్తీనా విభజన

(1-వ పేజీ తరువాయి)

గతవారం మెంటు ప్రకటించియుండిన వార్త అసత్యమని గతరాత్రి పాలస్తీనా ప్రభుత్వం ఖండించెను. అక్కడ పడినవి, బాంబులు కావట. అవి ఫిరంగిగుండ్లు అని తెలిసినది.

భద్రతామండలివారు పాలస్తీనావిషయములో ధర్మకర్తృత్వాధికారమును ఏర్పాటుచేయునిమిత్తమై ఆలోచించరాదని భద్రతామండలి సమావేశములో అమెరికా ప్రతినిధి వాదింపదలచుకోలేదు. ఐక్యరాజ్యసమితి సాధారణ సమావేశంలోనే ప్రస్తావింపబడునట ఇదుకొరకై ప్రత్యేకంగా అసెంబ్లీసమావేశము (సాధారణ) పత్యేకసమావేశమును జరుపవలసినదిగా ఒక తీర్మానము ప్రతిపాదింపబడును.

పాలస్తీనా విభజన జరుగుటకు సాధ్యం కాదనియు, అంతకు తక్కువైన మరొక ఏర్పాటును యూదులు అంగీకరింపవలెననియు ఒత్తిడిచేయవలెను. ఆ దుకు యూదులు అంగీకరించనియెడల పాలస్తీనాలో బ్రిటిష్‌వారు మేనెల 15 తేదీ తర్వాతకూడా మరికొంతకాలము పాలస్తీనాలో అధికారం వహించియుండవచ్చునని న్యూయార్కు పోస్టు అను యూదీయాభిమాన అమెరికనుపత్రిక వ్రాసెను. యూదులు అరబ్బులు ఒక విధమయిన తాత్కాలిక సమాధానమునకు వస్తే బ్రిటిష్‌వారు మరికొంతకాలం ఉండగలరనియు అమెరికనులు తాత్కాలిక ధర్మకర్తృత్వాధికారప్రభుత్వమును ఏర్పాటుచేసినట్లయితే పాలస్తీనాకు అమెరికను సేనలు అదుకొరకై పంపబడుననియు ఆ పత్రిక వ్రాసెను.

అరబ్బుల స్వతంత్రరాజ్యమును పాలస్తీనాలో ఏర్పాటుచేసినదాకా అరబ్బులు తమ పోరాటమును సాగించవలెనని అరబ్బుల సమితి యొక్క రాజకీయ కమిటీ ఏకగ్రీవంగా తీర్మానించినది.

# పరమాణు శక్తి కంట్రోలు

(1-వ పేజీ తరువాయి)

అని బ్రిటిష్ ప్రతినిధి సర్ ఫిలిప్స్ ఈవేళ ఐక్యరాజ్యసమితి పరమాణుశక్తి సంఘంలో సోవియట్ ప్రతినిధికి ఖండితంగా తెలియజేశాడు.

కెనడా, ఫ్రాన్సు, చైనాలు, తమ పక్షాన బ్రిటన్ మాట్లాడటానికి అధికారరీత్యా అనుమతిని ఇచ్చినవి. అమెరికా తన మూజువాణీ ఆమోదాన్ని తెలియచేసినది.

రష్యా ప్రతిపాదన ప్రకారం, పరమాణుశక్తి ఉత్పాదన కార్యక్రమం యావత్తుమీదను అంతర్జాతీయ కంట్రోలు వుండాలి. ఈ కంట్రోలు అధికారం భద్రతామండలికేవుండి, అసలు జరిపేందుకు అవసరమయిన సిబ్బందిని భద్రతామండలియే నియమించుకోవాలి. కాని పాశ్చాత్యదేశాలుమాత్రం, ఈ అధికారం భద్రతామండలికి వుంటే, వీటో అధికారాన్ని ఎవరయినా ఉపయోగించి దాని నిర్ణయాలను భగ్నంచేయవచ్చును కనక వేరే ప్రత్యేక సంస్థకు ఈ కంట్రోలు అధికారాన్ని ఇవ్వాలని వాదిస్తున్నారు.

**తెలుగు హరికథా కాలక్షేపం**

శ్రీ. కె. కె. ఆర్. యస్. సైక్లెపర్ల సంస్థవారి ఆధ్వర్యాన 286 పైక్రాఫ్ట్స్ రోడ్డులో (తిరువల్లిక్కేణి) శ్రీ అమ్మల విశ్వనాథంగారు (తెనాలి) బుధవారం (మార్చి 31) రాత్రి 8, 30 గంటలకు "శ్రీ కృష్ణతులాభారం" హరికథ చెప్పెదరు.


# పజిల్, గెలుపు సులభము రు. 25,000

ప్రస్తుతపు పోటీ K-54 | నికరం చేసినచో అయిదు బహుమతులు రు 10,000; 6,000; 4,000; 3,000; 2,000. | లోగడ పోటీ ఫలితములు J-50

6 మొదలు 21 వరకుగల అంకెలను ఈ గళ్లలో నంపుడు. వాడిన అంకె తిరిగి వాడగూడదు. అడ్డంగాను నిలువుగాను హారిజాంటల్‌గాను, ఎటుకూడినా మొత్తం 54 సంఖ్యగా వలెను.

| | | | |
|---|---|---|---|
| 7 | 9 | 16 | 18 |
| 10 | 20 | 5 | 15 |
| 14 | 8 | 17 | 11 |
| 19 | 13 | 12 | 6 |

1-వ బహుమతి మద్రాసు, సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో సీలువేసి డిపాజిటుచేసిన "ఆల్ కరక్టు" సొల్యూషన్‌తో అన్నివిధాల సమానంగా వుండే సొల్యూషనుకు యివ్వబడును. 2-వ బహుమతి, సగము సరియైన జవాబులకు అనగా, మొదటి రెండువరుసలు నిలువుగాగాని అడ్డంగాగాని సరిపోయినచో, యివ్వబడును. 3-వ బహుమతి, పావుభాగము సరియైన జవాబుకు అనగా మొదటి వరుస సరిపోయినచో, యివ్వబడును. 4-వ బహుమతి, మొదటి రెండు నెంబర్లు సరిపోయినచో యివ్వబడును. 5-వ బహుమతి మొదటి నెంబరు సరిపోయినచో యివ్వబడును, "కీ సొల్యూషన్" 18-4-48 తేదీ పత్రికలలో ప్రకటింపబడును.

ఆఖరు తేది 10-4-48 బహుమతుల జాబితా 27-4-48

ప్రవేశరుసుము 1 జవాబుకు రు 1/-. 6 జవాబులకు రు 5/-మాత్రమే

నిబంధనలు: ప్రవేశరుసుముతో (పోస్టల్ ఆర్డర్ ద్వారా గాని ముఖ్యంగా మనియార్డరు ద్వారా గాని) సాదా కాగితముమీద ఎన్ని జవాబులైన పంపవచ్చును. మీ అడ్రసు, కవరుమీద మనియార్డరు కూపనుమీద వ్రాయండి. బహుమతుల జాబితాకు మీ అడ్రసు కవరుగూడ పంపండి. మాకుచేరిన సొమ్ము నికరముగ రు 25,000 లకు తక్కువగా వుంటే, బహుమతుల విలువలు దామాషాగా తగ్గించబడును. అన్ని విషయములలో మా తీర్పే ఖాయము. ఇతర రూల్సు మామూలు. 1 2-వ బహుమతులవారికి టెలిగ్రాము ద్వారా వెంటనే తెలియచేయబడును. జాబులు యింగ్లీషులోనే వ్రాయాలి.

**లక్ అండ్ కో,** గవర్నమెంటు రిజిష్టర్డుపరం. 1584 43/27 తిరువత్తియూరు హై రోడ్. **మద్రాసు 17.**



# ఇండియన్ బ్యాంక్ లిమిటెడ్

| | | |
|---|---|---|
| అనుమతిపొందిన మూలధనము | రు. | 1,00,00,000 |
| చందాచేయబడిన మూలధనము | రు. | 72,00,000 |
| పిలువబడి, చెల్లించబడిన మూలధనము | రు. | 53,00,000 |
| రిజర్వు ఫండు | రు. | 62,00,000 |

హెడ్డాఫీసులోను, దక్షిణ ఇండియాలో గల యీ బ్యాంకు యొక్క బ్రాంచీలలోను, మూడు మొదలు ఆరుమాసములవరకు రు. 10,000/-ల వరకు పైమొత్తములను ఈదిగువ వడ్డీరేట్ల ప్రకారము, ఫిక్సుడ్ డిపాజిట్లు తీసుకొనబడును:—

| | | |
|---|---|---|
| 3 నెలలకు | సాలుకు | 2¼% |
| 4 & 5 నెలలకు | ,, | 2½% |
| 6 నెలలకు | ,, | 2¾% |

ఈ విధంగా తీసుకొనబడిన డిపాజిట్లు 30 సెప్టెంబరు 48 తర్వాత నిలవ యుంచనీయబడవు.

(బోర్డువారి అనుమతిని)

ఎన్. గోపాలఅయ్యర్, సెక్రటరి.






# స్కాబికిల్

కురుపులకు తదితర చర్మవ్యాధులకు

దిటాటా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్.



మలేరియా, ఇన్‌ఫ్లూయంజా, తదితర జ్వరము లన్నిటికిని

# బాట్లీవాలా ఏగ్‌మిక్శ్చర్ మరియు మాత్రలు

వాడుడు. ఎ. ఎం. ఎస్. డాక్టర్లచే సిఫార్సుచేయబడినది. కెమిస్టులవద్దను, వరుకుండవారల వద్దను దొరకును. సోల్ సెల్లింగ్ ఏజంట్లు:—

P. M. PATNI & Co. PRINCESS STREET, BOMBAY, 5. Tel. Add. Licoau



# ఫలహారశాలలు!

## మీ గాహకులందు రోగములను వ్యాపింప జేయుచున్నారా?

ఫలహార మందిరములు, భోజనశాలలు మొదలగు సంస్థలు, రోగక్రిములను తెచ్చు బొద్దింకలు, నల్లులు, చీమలు, ఈగలు మొదలగువాటికి స్థావరములై తమకు తెలియకుండానే, రోగములను, అంటువ్యాధులను వ్యాపింపజేయుచున్నవి.

చౌకగా కీటకములను నాశనము చేయుటకు ఉపయోగించు టార్చిబ్రాండ్ కీటక నాశినిని వాడినచో మీ ఖాతాదార్లందరకు మీపై అభిమాన గౌరవములు హెచ్చి, మీ వ్యాపారము వృద్ధిచెందును. ఇంతేగాక ఆరోగ్యమును పరిశుభ్రతను పెంపొందించి మీరు సమాజమునకుకూడా సేవ చేసినవారగుచున్నారు.

అత్యధిక శక్తిమంతమగు కీటక నాశినియగు టార్చిబ్రాండును వంటయిండ్లలోను, పడక గదులలోను, భోజన గదులలోను నిత్యము వాడండి. ద్రవరూపములో 5% డి. డి. టి. పొడిరూపములో 10% డి. డి. టి. కలదు.

## ఉచిత సలహా

అడిగినంతనే యివ్వబడును. యథార్థములగు సంస్థలకు ఆర్డరుపై. 1 గ్యాలను, 4 గ్యాలన్లు 45 గ్యాలన్లు టిన్నులలో ప్రత్యేక తక్కువ ధరలకు సప్లయి చేయబడును.



# టార్చి బ్రాండ్ డిడిటి ఎమల్షన్ & పౌడరు

ప్రజలకు పశువులకు నిరపాయకరము.

తయారు చేయువారు: ప్రోగ్రెసివ్ కెమికల్ కార్పొరేషన్ లిమిటెడ్.

సోల్ అమ్మకపు ఏజెంట్లు: టాటా ఆయిల్ కంపెనీ లిమిటెడ్.



# మధుమేహము

ప్రపంచ ఖ్యాతిగాంచిన "జల్బర్ట్స్ డయబిటిస్ క్యూర్" ఇప్పుడు ఇండియాలో దొరకును. మధుమేహ వ్యాధికి ఇది సిద్ధౌషధమని గొప్పగొప్ప వైద్యశాస్త్రజ్ఞులు అంగీకరించియున్నారు. ఇది వాడ క్రమములో చక్కెర కుంటకుంటె వెంటనే ఆపి. వ్యాధి ఎంత గడ్డుదైనప్పటికీ, శరీరమునకు మంచి బలమొసంగును. అమూల్యమైన ఈ "జల్బర్ట్స్ డయబిటిస్ క్యూర్" చికిత్స వెంటనే ప్రారంభించి, అది మీకు ఎంత హెచ్చుకాలము ఉజ్వలమైన ఆరోగ్యము, సుఖజీవనము నొసంగునో చూడుడు. ఖరీదు సీసా రు. 10/-లు. ఒక పక్షంరోజుల మోతాదు పోస్టేజి రు. 0-12-0 లు అధికము. వేరే మందులు అమ్మబడును.

ఏజంట్లు: అప్పా అండ్ కంపెనీ, 286, చైనా బజారురోడ్డు, మద్రాసు.

